శ్రీ

# రామశతకము.



క॥ శ్రీరామ పరంధామా
దారుణ భవజలధి తరణ తారకనామా
చారు సుగుణ గణధామా
సారసభవ వినుతనామ జగదభిరామా॥ 1

అరిషడ్వర్గ విదారా
వరషడ్గుణ దరణ మానివర యాధారా
పరిపూర్ణ యోగ సారా
కరుణామృత ధార భక్త కల్పక రామా॥ 2

దురితాంధకార భాస్కర
పరతత్వవిచార కర్మ పాశకుఠారా
గురుతర మాయా దూరా
వరభక్త మనోవిహార భవహర రామా॥ 3

పరమ షడక్షర పావన
వరతారక మంత్ర వజ్రపంజర విలసత్
పరిపూర్ణ నిలయ దుర్భర
తర సంసృతి తాతవిలయ తారక రామా॥ 4

వరనారాయణ శంకర
నిరుపమ మంత్రస్థవర్ణ నిర్మితనామా
స్మరహర గౌరీమానస
నిరత జపిత దివ్యనామ నిరుపమ రామా॥ 5

రామాయను నక్షరద్వయ
మూ మూలముగా హరించి యఘ సంచయమున్
తామోక్ష మొసగు సతమును
యేమరక స్మరించువారి కేర్పడ రామా॥ 6

హర పార్వతు లాత్మలలో
నిరతము జపియించుచుండు నీదివ్యంబౌ
సురచిరమగు నామంబే
ధరతారక మంత్రమగుచు దనరదె రామా॥ 7

నీనామ మంత్రజపమును
పూనికతో జేసిమౌని పుంగవుఁ డగుచున్
తానువెలసె వాల్మీకి జ
గాన బ్రహ్మఋషి సమాఖ్య గని శ్రీరామా॥ 8

శ్రీరామ నామస్మరణము
నారాయణ వరసహస్ర నామ తులిత మం
చారాజ తాద్రినిలయుఁ డు
భూరి కృపను దెలిపెసతికి బోధగ రామా॥ 9

పతితుల పావనులనుగా
నతిశయకృపఁ జేయుచుంట నవ్యయ, నీకున్
క్షితిఁ బతిత పావనుండను
స్తుతబిరుదము గలిగెవరయశోనిధి రామా॥ 10

స్మరియించు మాత్రమున దు
ర్భర పాపములణఁపజాలి పార్వతికి నిరం
తరమంత్ర రాజమగు నీ
వరతారక నామమెంతు వరదా రామా॥ 11

రాయన నఘములడఁగునని
మాయన నవిచేరరాక మరలుననుచు రా
మాయన నఘహరమగు నని
యీ యమల రహస్యమేను నెఱిఁగితి రామా॥ 12

మధురాక్షర సంయుతమై
విధి రుద్రనిరంత పఠిత విమలతరంబై
సదమలమగు నీనామము
మదిలోన స్మరింతసతము మానక రామా॥

రామ రమణీయ నామా
కామితఫలదా జగత్ప్రకాశక రామా
కామాది గణ విరామా
తామసగుణ రహిత, విమలతారక, రామా॥ 14

వాచామ గోచరంబగు
నీచిత్ర మహాత్వమెన్న నెవరితరంబౌ
నా చతురానన శంకరు
లే చిత్ర భ్రమణములను జెందఁగ రామా॥ 15

దారుణ భవ సాగరమును
నేరుపునఁ దరింపఁ జేయు నిర్మలతరమౌ
నీరామనామ తరణిని
జేరిచి భవజలధి దాటఁ జేయుము రామా॥ 16

మాతాపిత గురుదైవము
లోకఁడీ, నీవగాక యొరులెవ్వరు నా
చేతమున నిన్ను నమ్మితి
నో తాపత్రయ విదారమో శ్రీరామా॥ 17

# రామశతకము.

మాయా మోహితు లగుచును
కాయము తానని భ్రాంతిఁ గలతను బడుచున్
జాయా సుతాదులకు నై
పాయని దుఃఖముల నరులు పడుదురు రామా॥ 18

గిరిసంజాత ప్రవాహము
లురువడితోఁ బాటిపాటి యుదధిగలియు న
ట్లురుసంసృతి వెలువడి వడి
నరుడు నినున్ బొంద శాంతినందఁడె రామా॥ 19

ఓ సర్వాంతర్యామీ,
యో సత్య జ్ఞానరూప, యో సర్వేశా,
యో సగుణ నిర్గుణాత్మక,
యో సకలాధార, దేవ, యో శ్రీరామా॥ 20

దారుణ సంసార భయద
ఘోరాటవిఁ బడి పదం బగోచరముగ ని
ట్టూరక పరిభ్రమించెద
శ్రీరామా, సత్పదంబుఁ జేర్పుము రామా॥ 21

నిను వర్ణించెడు వాక్కును,
అనయము నీయందులగ్న మా మానసమున్,
నిను నఖిలంబునఁ గనఁ దగు
సునిసిత జ్ఞానము, నొసంగు శోభనరామా॥ 22

నిను వర్ణింపఁ గ దరమా!
మనమున కందనివి నీదు మహిమలు, భువియున్
వనధియు వహ్నియు వాయువు
ఘననభ మినశశులు తారకలఁ గనరామా॥ 23

నీమహిమఁ బొగడ నేరక
తామరస భవుఁడు శివుండు దాక్షాయణియున్
వేమఱు మౌనము దాల్పఁగ
రామా, నాతరమె పొగడ రామా రామా॥ 24

నిగమములు పొగడ నేరని
యగణితగుణు నిన్నుఁబొగడ నజ్ఞానిని నే
దగుదునె! జగదభినుత, స
ర్వగుణ సుగుణాభిరామ, రామా రామా॥ 25

జగములు గలుగఁగ నిలువఁగ
న్రాగి నణఁగంజాలు నెవని యూహావలన నా
జగధీశుఁడఁవగు నీ య
త్యగణిత శక్తిని నుతింతు ననయము రామా॥ 26

లోకంబను రంగస్థలిఁ
బ్రాకటముగ జీవ చిత్ర ప్రతిమలనిడి యి
చ్ఛాకృతిగా నాడించెడి
నీ కృతిమ లీల లెంతు నిత్యము రామా॥ 27

లోకములన్నియు నడఁగ న
లోకంబగు నట్టి బయలులోఁ బెను నిశయం
దేకాకృతిని వెలింగెడు
నీకున్ జేజే లొనర్తు నే శ్రీరామా॥ 28

పెక్కగు నాకృతు లొప్పఁగ
నక్కజముగ జగమునిండి యాడుదు వొకటన్
ఉక్కడఁచి యాజగంబుల
నొక్కడ వై వెలుఁగుచుందు వొకతటి రామా॥ 29

నిగమా రాధ్యము నిర్గుణ
మగోచరము నవ్యయంబు నమర వినుతమున్
జగదా ధారంబగు నీ
యగణిత తత్త్వంబు నెంతు ననయము రామా॥ 30

సత్య జ్ఞానా నందము
నిత్యంబును నిర్మలంబు నిరతిశయము సం
స్తుత్యంబగు నీతత్త్వము
నత్యంత సుభక్తి నెంతు నాత్మఁ రామా॥ 31

పరము పరిపూర్ణ మేకము
నిరుపద్రవ మమర మజము నిష్కల్మష మ
క్షరము ననంతము నగునీ
స్థిర తత్త్వము నెంచి ముదముఁ జెందెద రామా॥ 32

విద్యాస్వరూప మాద్య మ
విద్యా ధ్వాంతాపహంబు విమలతరంబుఁ
ఆద్యంత రహితమగు యు
ష్మద్యాథార్థ్యంబు నెంతు మాటికి రామా॥ 33

భువనేశ, భువన రక్షక,
భువనాత్మక భువన వంద్య భువనాకారా
భువనకర భువనదూరా
భవనాశక, నీకు నెపుడు ప్రణతులు రామా॥ 34

పరమేశ, పర బ్రహ్మ,
పరమ పురుష, భవవినాశ, పరమాత్మ, జగ
ద్భర, జగదంత ర్యామీ,
చరా చర, ప్రపంచరూప జయ శ్రీరామా॥ 35

దేవ, స్వయంభూ, యద్భుత
భావాతీత ప్రపంచ పరికల్పిత భూ
తావాస, భూతరక్షక
జీవేశ్వర, నామ భూత చేతన రామా॥ 36

నీవే సచరా చరమగు
నీవిశ్వంబగు దు జ్ఞాన నేత్రంబునకున్
ఓవిశ్వ శరీర, జగ
జ్జీవన, విశ్వాత్మ, దేవదేవా రామా॥ 37

ఘననామ రూప భువనం
బనఘా నీమాయవలన నావిర్భవ మౌ
ను నిలుచు నడంగుచుండును
నిను నంటకె చిత్రి మహాహా నీగతి రామా॥ 38

కర్తయు భర్తయు హర్తయు
పూర్తిగ జగములకు నీవ పురుషోత్తమ నీ
నర్తన నిలయను భువనము
యార్తవన యభయ దాత యవ్యయ రామా॥ 39

జ్ఞానము భక్తియు యోగ
ధ్యాన సమాధ్యాది సకల ధర్మగణములున్
పూని కనుంగొన నీవే
వానికిఁగర్తయును నీవె ప్రభు, శ్రీరామా॥ 40

బ్రహ్మాండ నాథుఁడగు నిను
బ్రహ్మాదులు తెలియలేక భ్రమియింప పర
బ్రహ్మ నాతరమా గన
బ్రహ్మ స్తుతనామ, పరమ పావన రామా॥ 41

సనకాది మునీంద్ర నుతా,
దినకర కోటిప్రకాశ, దివిజాధీశా,
అనుపమ స్వయం ప్రకాశా,
జనన మరణ దుఃఖనాశ, జయ శ్రీరామా॥

పర సాంఖ్య తారకమనస
పరమ రాజయోగసార భక్తాధారా
నిరుపమ మాయా దూరా
పరబ్రహ్మ పరంధామ పావన రామా॥ 43

శుక జనకాది మహాత్ములు
ప్రకటిత సుజ్ఞాన ఘనులు పావన చిత్తుల్
సకలము బ్రహ్మ మయము గా
నకలంక సుదృష్టిగందు రవ్యయము రామా॥ 44

నారద ప్రహ్లాదాదు ల
పారంబగు భక్తినిన్ను భావములందున్
కోరిక లుడిగి భజించిరి
వారల మహింబు లెన్న వశమా రామా॥ 45

పరహితరమలౌ సుజనులు
పరమ మునులు నిత్య సత్యపరతంత్రులు స
చ్చరితలు శాంత మనస్కులు
నిరతము సంతుష్టులగుచు నెగడరె! రామా॥ 46

ధన దారా నిరపేక్షులు
జన సంగ విదూరు లఖల సంశయ రహితుల్
మునినుత సుజ్ఞాన ఘనులు
అనఘులు నిను బొంద నర్హలగయఁగ రామా॥ 47

త్రికరణ శుచి సహితంబగు
ప్రకటిత నవవిధ సుభక్తిపావనలు నినున్
సకలంబునందు గాంతురు
సుకృతాత్ములు వారు ధరణి సురనుత రామా॥ 48

నిరుపమ గాఢ విరక్తియు
పరమాత్మ ధ్యాన సక్తి పాపవిరతియున్
వరసద్గుణ సంపదగల
పురుష శ్రేష్ఠుండు నిన్ను బొందడె రామా॥ 49

ధర్మార్థ కామ మోక్షా
నిర్మములై సన్మనముల సేవాంఛలు తే
కోర్మిని నినుభజియించు న
కర్మలను తరింపఁజేయు ఘనుఁడా! రామా॥ 50

సర్వారంభ త్యాగులు
సర్వసములు సర్వహితులు సాధు చరిత్రుల్
సర్వత్యాగులు నగు బుధు
లుర్విని నిను బొంద నర్హులో శ్రీరామా॥ 51

హానా దాన విరక్తులు
మానిత స్వాధీన చిత్త మహిమాన్వితు ల
క్షీణ తపో నియతాత్ములు
నైన మహాత్ముల స్మరింతు నాత్మను రామా॥ 52

జీవ బ్రహ్మైక్య యోగ
పావన విజ్ఞాను లైన భక్తులు ముక్తిన్
గేవలమును గాంతురు జగ
తీవర, జగదాదిదేవ, దేవా, రామా॥ 53

జీవుఁడనగు నే నీవను
భావనచేఁగంటి క్షణము పరమాత్ముఁడఁగాఁ
బోవిడుచుచును నుపాధుల
నీవిశ్వంబెల్ల నిండి యేనయి రామా॥ 54

తగఁదత్పద వాచ్యుఁడ నే
నొగిఁద్వంపద లక్ష్యమగుచు నొప్పితి నూహన్
జగమెల్లనిండి యొకఁడై
యగణితముగ నద్వితీయుఁడై శ్రీరామా॥ 55

దేవా, యాగతి సతతము
జీవ బ్రహ్మైక్యయోగ సిద్ధిగలుగ నా
కీవే చలన రహితమగు
పావన బ్రహ్మను భవము వరదుడ రామా॥ 56

సకలంబును బ్రహ్మంబని
సకలావస్థలఁదలంచు సమచిత్తుఁడుదా
సకల వికృతి రహితంబగు
సకలంక పదంబు నొంది యలరుఁడె! రామా॥ 57

పరతత్త్వ వేదియగు నరుఁ
డురు కష్ట పరంపరలకు నోర్పున నుండున్
గిరి వర్ష వాత ఘాటికిఁ
గరము చలింపని విధానఁగన శ్రీరామా॥ 58

దిన కరుఁడఖిల రసంబులఁ
దన కరముల ద్రావి వానిఁదాఁకని రీతిన్
నిను బొందు యోగి విషయము,
లను నంటియు వాని దోషమంటఁడు రామా॥ 59

సతత పరమాత్మరతుఁడగు
యతి దేహము నందు మమతయుడఁగి విడుచుఁదాఁ
జ్యుత కంచుకమును వ్యాళము
మతిఁదలఁచక విడిచిపోవు మాడ్కిని రామా॥ 60

ఉన్మత్తుని వలె నుండును
జిన్మయ తత్వమును గాంచి చిత్తములయమై
తన్మయుఁడౌ యోగి వరుఁడు
జన్మము సార్థకము నొంద శాంతిని రామా॥ 61

ఎదుటను దోఁచెడు విశ్వము
సదమల బ్రిహ్మంబుగా నచంచల బుద్ధిన్
హృదయమున నిలిపి భేదము
వదలి మునియు సర్వసమత వర్తిలు రామా॥ 62

సంగ రహితులౌ సన్ముని
పుంగవులు దృఢాత్మ శక్తి పూర్ణసమాధిన్
రంగుగ నీలో లయమయి
యంగముపై నెఱుక వీడి యలరరె రామా॥ 63

ఆగామి సంచితములును
యోగియుదన్ దెగడుఁబొగడు నోరులు గ్రహింపన్
భోగించుదు ప్రారబ్ధము
లాగను మోక్షంబు కర్మ ధ్వంసత రామా॥ 64

హృదయ నివాసుడవౌనిను
సదమల విజ్ఞానదృష్టి సంయమి వశ్యుల్
వదలక గని హర్షింతురు
విధి రుద్ర శరణ్యా, వేద వేద్యా, రామా॥ 65

పంచప్రభూత మయము ప్ర
పంచము నీమాయవలనఁ బ్రభవింపదె! యా
పంచకమునఁ బంచకోశ
చంచలదేహములు పొడమె జగతిని రామా॥ 66

దేహివగుచు నీ కల్పిత
దేహంబుల నీవునిలిచి దెలియఁబడక త
ద్దేహము తామను భ్రాంతిని
మోహితుల నొనర్చిమాయ ముంచెనురామా॥ 67

మాయా మయమగు జగమున
బాయని దుఃఖములఁజిక్కి పలవించెద నీ
కాయమున మమత వీడక
నీయెడమది ప్రజ్ఞనిలిపి యేలుము రామా॥ 68

గురువులకెల్ల గురుండవు
అరయ జగద్గురువరుండ వజగురుఁడవు నో
పరమగురూ సద్గురు నీ
శరణ మొసగి కావుమయ్య జయశ్రీరామా॥ 69

సురుచిరమై సుభకరమై
పరమార్థప్రదము పరమ పావనమగు నీ
వరరామ మంత్రజపమునఁ
జరితార్థము నొందజేయు జన్మను రామా॥ 70

ఉపదేశ మొసగి మామక
చపలత నడగించి చిత్త శాంతి యొసగుచున్
జపియింప శక్తి గూర్చుము
తపియింపగఁ జేయుభవము తారక రామా॥ 71

ఇతరము లెరుగను నీవే
గతియనుచును నమ్మియుంటిఁ గరుణింపుమునన్
యతివినుత, పతితపావన
చతురాసన జనక, దేవ, జయ శ్రీరామా॥ 72

భవరోగ నివారకమగు
తవ నామామృతరసంబు దాగ్రివుచు తృప్తిన్
భవరుజయడంగ త్వత్పద
ప్రవిమల సౌఖ్యంబుబడసి బ్రదికెద రామా॥ 73

అవ్యక్తంబగు నీగతి
సువ్యక్తమొనర్చి భ్రమలుచూర్ణించి కృపన్
భవ్యపదమొసగు నిర్మల
దివ్యసుధామధుర నామ దేవా రామా॥ 74

మానసము జడంబయ్యెను
జ్ఞానము నశియించె బుద్ధిచలనముడిగె నిం
కేనెట్లు నిన్ నుతింతును
దీనావన ప్రజ్ఞనొసగి దేర్చుము రామా॥ 75

త్రిగుణాతీతుండవయిన
భగవంతుఁడ నాదు కర్మబంధముల వడిన్
దెగఁజేసి కరుణ నిర్మల
మగు సత్వగుణంబు బెనిచి మనుచుము రామా॥ 76

జగదానందకరుండవు
భగవంతుఁడ వఖిలలోకభర్తవగు నినున్
బొగడగ నాతరమా యో
నిగమాంతసువేద్య పరమ నిర్మల రామా॥ 77

పాలింపుము నను, నా మొర
లాలింపుము సుప్రసన్నమగు చిత్తముతో
లాలింపు దీనసౌ నను
దూలింపు మఘవ్రజంబు దొర, శ్రీరామా॥ 78

భారము నీపయిఁ మోపితి
నేరంబుల నెల్ల సైఁప నిన్ గోరుదు వి
స్తారదయ వెలయ దుర్భర
దారిద్ర్యవిదార, దుఃఖతారణ, రామా॥ 79

దుడుకుతనముచే నేకడు
చెడుగుల నొనరించుచుందు శిక్షించెదొ, యే
యిడుముల లోఁ బడద్రోయుదొ
నొడయుడవగు నీవె భార మో శ్రీరామా॥ 80

జననము నందఁగఁ జేసితి
వనయము రక్షించుచుంటి వఖిలవిధములన్
నెనరున నేరముల సైచి
నను నేలు కృపాలవాల, నాశ్రిత రామా॥ 81

నీదాస దాస దాసిని
నాదోసము లెంచ కేలు సతమందారా,
యోదాసావన, దీన జ
నాధారా, యఘవిదూర, యవ్యయ రామా॥ 82

రక్షకులు లేని వారికి
రక్షకుఁడవు నీవ దీనరక్షక, నిను నే
రక్షణకు శరణు జొచ్చితి
రక్షింపుము నన్ను సగము రక్షక రామా। 83

అక్షరుఁడ వనంతుండవు,
సాక్షాన్మోక్షప్రదుఁడవు సకలేశ్వర, నీ
యక్షీణ కటాక్షములను
వీక్షింపుము నన్ను లోకవిభు శ్రీరామా॥ 84

ఆద్యంతరహితు, నిగమా
రాధ్యుని, నిగమాంతవేద్యు, హరివిమలుని నినున్
విద్యాస్వరూపు, నభవు న
విద్యావిధ్వంసు, నెంతు విధినుతు రామా॥ 85

సారవిహీనంబగు సం
సారంబున వెతలఁబడుచు సర్వేశ, నినున్
జేరుటకు శక్తి చాలక
యూరక భ్రమియింతు కరుణ నోముము రామా। 86

నమ్మాయ చేతనై నే
నిమ్మహిలో దారిగనక నెనసిన కలతన్
గుమ్మరుచు నుంటి నగతి
నెమ్మది ప్రజ్ఞానమొసగి యేలదో రామా॥ 87

సకలేశుఁడవగు నిను నేఁ
బ్రకటితముగ నెఱిఁగి చిత్తపటిమ గలుగమిన్
వికలత బడుచుంటిద నో
యకలుష నాచిత్తచలన మడఁచుము రామా॥ 88

వేదాంతవేద్యుఁడగు నీ
యాదిమ తత్వంబెఱుంగు దనుచును మదిలో
నేదర్పంబునఁ బొంగుదు
నీదర్శనసుఖము గనక నిటు వృథ రామా॥ 89

కాలము దరియగ వచ్చెను;
ఏలీల ననున్ గ్రహించి యేలెదొ కరుణన్;
గాలాత్మ, కాలరూపా
కాల కాల ఖల వినాశ, కలిహర రామా। 90

నిరుపమ మగు వైరాగ్యము
నిరతము నీదివ్యతత్వ నిర్మలదృష్టిన్
వరసంతుష్టియు నాకో
పరమ పితా, యొసగి ప్రోవు వరదయ రామా॥ 91

ధరనిందా స్తోత్రములును
బరమ ముదిత శోకములును పాటింపని సు
స్థిర సుజ్ఞానము సజ్జన
వరసంగతి గూర్చి ప్రోవు ప్రభువర రామా॥ 92

ఇమ్మహి వలయంబందున
క్రిమ్మర బ్రభవింపనట్టి ఘనశక్తిని, నా
కిమ్మా కృప రంజిల్లఁగ
బ్రహ్మామరవంద్య, పరమపావన, రామా॥ 93

నీలో జనించు జగములు
నీలోననె వృద్ధిగాంచు నీలో లయమౌ
నీలోన నను లయింపుము
జాలం బికనేల దేవ జయ శ్రీరామా॥ 94

పాడెద నీనామము గొని
యాడెద నద్భుత తరంబులౌ నీమహిమల్
ఆడెద దైవము నిన్వడి
లేదని భువనముల, శంక లేకను రామా॥ 95

మఱి మఱి నిను బ్రార్థించెదఁ
బరమ దయాకర, మదీయ ప్రార్థనవిను దు
ర్భర సంసృతి నడుగంటెద,
పరమార్థముఁజూపి వ్యథలఁబాపుము రామా॥ 96

వంతలచేఁ గడు నవసెద
సంతోషముగూర్చి గావు సదయహృదయ నే
నుంతయు సుకృత మెఱుఁగ నఘ
ధ్వాంతాపహా, నీవెప్రాపు దయగను రామా॥ 97

కరుణానిధివి నిరంతర
శరణాగత రక్షకుఁడవు జగదీశుఁడ వీ
వరయఁగ దీనావనుఁడవు
పరిపూర్ణ దయాస్వరూప వరదా రామా॥ 98

శ్రీరామ నీదు మహిమం
బీరేడు జగంబులందు నెవరెఱుఁగుదు రా
త్మారామ, ధ్యానరతులు న
పార తపోధనులు దక్క నన్యులు రామా॥ 99

శరణు శరణు శ్రీరామా
పరబ్రహ్మ పరంధామ పాలయమాం ఓ
కరుణా సాగర, శ్రీకర,
దురితాటవి దహన, భక్తతోషణ, రామా॥ 100

నమో నమో శ్రీరామా
నమో సకల భక్తకామ సారక భీమా
శమాది యష్టాంగ సహిత
సమాధి సాధిత మునీంద్ర సన్ముఖ రామా॥ 1

జయ జయ జగతీభర్తా
జయ జయ జయ సకలలోక శాసనకర్తా
జయ జయ పాపవిహర్తా
జయ జయ జన మనోహర్త జయ శ్రీరామా॥ 2
వినుతు లోనరింతు నీకున్
అనేక రూపాభిధాన, యవ్యయ, ధీరా,
ముని జన మానస వాసా
ప్రణుతార్తి వినాశ, దేవపాలయ రామా॥ 3
వందనము రామచంద్రా
వందన మనురేంద్రవంద్య వరదయసాంద్రా
వందన మానందనిలయ
వందనము సమస్తలోక వరదా రామా॥ 4
దండము గొనుమా ముని
మండల సంస్తూయమాన, మహాదభిధానా
మండిత సద్గుణగణ బ్ర
హ్మాండాధిప దేవదేవ యజనుత రామా॥ 5
అష్టాంగ సంయుతంబగు
సాష్టాంగము గొనుము రామ జగదభిరామా
సృష్టిస్థితి లయకారణ,
దృష్ట, సకల కర్మసాక్షి, దయగను రామా॥ 6
మంగళప్రద, శ్రీరామా
యంగజ రిపువినుత దివ్యయమలిననామా
మంగళ మాతను జయ సుభ
మంగళములు నీకు లోకమాన్యా రామా॥ 7

శ్రీరామా నీశతకము
పూరణ మొనరింపగంటి పుణ్యవశమునన్
గోరెద నాయనుజుని కిది
కూరిమి నంకితము సేయ గురు శ్రీరామా॥

శ్రీసెట్టి వంశ భవుఁడును
భాసుర లక్ష్మీనృసింహ వర నాముండా
నాసహజన్మునికి కృతిగ
నోసురనుత యొసగుచుంటి నో శ్రీరామా॥

ఇది వాని కందఁజేయుచు
సదమల కైవల్యపదవి సమకూర్పుము నా
హృదయ వ్యథ నంతరింపుము
సుధా మధుర దివ్యనామ సుభకర రామా॥ 10

సీ॥ ప్రేమ మీఱ నీకు నీరామ శతకము
సంకీర్తంబుగాఁగ నలవరచిత
అందు కొనుము కూర్మియలరార సోదరా
లక్ష్మి నారసింహ యనయముగ॥

క॥ సీరము సుభద్రయుమ్మను
నేరచియించితిని భక్తి నీకు శతకమున్
సూరవరులు మన్నింపగ
ధారుణి నిది నిలుపు కరుణ దనరగ రామా॥

గీ॥ భారతీ తీర్థసభయందు ప్రభువరుండు
జయపురీశుఁడు నాకిచ్చె సదయుఁడగుచు
అలర 'కవితా విశారద' యను బిరుదము
శ్రీపరంధామ నీకృప చేత రామ॥

క॥ ఈ రామ శతక మెప్పుడును
పారాయణ జేయుచుండు భక్తులకెల్లన్
శ్రీరామ దయ నొసగు న
పారముగా నిహసుఖములు పరమును రామా॥

క॥ శ్రీరామ రామ రామా
శ్రీరామా రామరామ శ్రీశ్రీ రామా
శ్రీరామ రామ రామా
శ్రీరామా రామ రామ శ్రీశ్రీ రామా॥

సమాప్తము.

---

# సోదరస్మృతి.

శ్రీయలగు సెట్టి వంశాబ్ధి శీతకరుడు
అప్పలస్వామి యార్యున కగ్రసుతుడు
జనని శ్రీవేంకయమ గర్భ జలజహితుడు
అనఘ చరితుడు నాకు జ్యేష్ఠానుజుండు
అమల గుణముల ప్రోవు విద్యలకు ఠావు
పండితారాధ్యు డత్యంతపావనుండు
సత్కవి విభూషణుం డతిశాంతమూర్తి
రాజ్యతంత్ర వైశద్య విశారదుండు
నీతినిపుణుడు ధర్మ వినిర్ణయుండు
కార్యవేది దృఢాత్ము డగర్వి సుమతి
బుధజనానందకరుడు భూమీంద్రనుతుడు
సరస సత్కావ్యరచనా విశారదుండు
నవరస ప్రపూర్ణ నవకావ్య కవనభర్త
చతురహాస్య శృంగారాదిచారు పణితి
పూర్వ కవిరాజ చంద్రుల పోల్కి-దనరి
అవని నిజకీర్తి చంద్రిక లలముకొనగ
బాల్యమాదిగ విద్యల ప్రతిభగాంచి
యున్నత పరీక్షలనుదేలి వన్నెమీరి
మేష్టరై విద్యలగరపి మెప్పుగాంచి
సెట్టి మేష్టరనెడి పేరు జగతి నిలిపి
న్యాయవాదియై కొన్నాళ్ళమేయ రీతి
తగవులను దీర్చి ప్రఖ్యాతి దానగాంచి

పొందితి విశాఖపురమున పూర్ణయశము
జయపురాధీశునకు మేలుజరిపి యతని
కోర్కెచే కార్యదర్శివై కూర్మియలర
నిపుణమతి రాచకార్యముల్ నెరపి గరిమ
సజ్జనులుమెచ్చ జరియించి జనవిభునకు
సత్కృతులనిచ్చి సభలలో సరసులలర
'కవి విభూషణ' బిరుదము గాంచి మించి
భారతీ తీర్థసభ ముఖ్యపండితుడుగ
సహజ సాహిత్య సంపదన్ సాటిలేక
పోతనామాత్యుతోడను పోల్కిగాంచి
చారుతర కల్పనాశక్తి జగతిమెచ్చ
వ్యాస భట్టారకుని సాటి వచ్చుననగ
చతురంతర హాస్యరసవ్యాప్తి నతులితముగ
పాండురంగ కవీశుని ప్రతిభ గాంచి
మించి శృంగార రసపూర్తి నంచితముగ
నలరి శ్రీనాథ కవిశ్రేష్ఠు నాక్రమించి
యాసుకవితా ప్రభావము నల్లిక జిగి
అల్లసాని పెద్దనకవి ననుసరించి
మృదు మధుర కల్పనాశక్తి కొదువలేక
వామలూరూద్భవుని కనవచ్చుననగ
పూర్వకవిరాజులే నీకు పోల్కియనుచు
యిప్పటి కవీంద్ర చంద్రుల మెప్పుగాంచి
వేంకట కవీంద్రమూర్తి నీకిడగ బిరుదు
అభినవవ్యాసు డనుచును నందరెరుగ
కవులకెల్ల భూషణమయి వ్రాలుకతన

జయపుర నుడు నీకిచ్చె చతుర బిరుదు
చతురతర నీతి చాణక్య సరస వాక్య
భూరితర బుద్ధి విభవ విబుధ గురుసమ
సకల శాస్త్రపారంగత సాధు చరిత
రూపజిత కమలాసుత పాపరహిత
మధుర మంజుల యుత హాస్యవచన చతుర
నద్యశః పూర్ణచంద్ర యోసత్కవీంద్ర
వంశభూషణ సజ్జనవంద్యసుగుణ
మరువగా వచ్చునే నిను మాన్య చరిత
యేబదియు తొమ్మిదేండ్లకే యిహము వీడి
సతిసుతుల నీవియోగ సంగతుల జేసి
మమ్మునందర దుఃఖాబ్ధిమగ్గ జేసి
కవుల మిత్రుల బంధుల కలత ముంచి
లక్ష్మినరసింహ సకల సులక్షణయుత
అరిగితే సోదరా నీవు అమరపురికి
వీడితే విశాఖపురంబు విమల చరిత
అకట బహుధాన్య వత్సరమందు చైత్ర
పూర్ణిమను నీకు నాయువు పూర్ణమయ్యె
నేబదేడులలోన నీవేగుదు వని
ఆత్మ యందైన దలచలేనైతి నయయొ
సోదరా లక్ష్మినరసింహ సూరివర్య
యెట్లు సహింతు నీలేమి కేను తండ్రి!

ఉ॥ అక్కయటంచు త్వాద్రిచితి
మొత్తగు గ్రంథములన్ లిఖించి వేం

పెక్కుడుప్రీతి నాకు నిక
ప్రేమను బంపుదు శేరు తమ్ముడా
యెక్కువ ప్రీతి నీగృహము
కేనరుదేరగ హర్షమందుచున్
నిక్కపు ప్రేమ రంజిలగ
నెవ్వరు గాంచెదరింక సోదరా॥

తక్కక నే కవిత్వమని
తప్పుల కుప్పలు వ్రాయ దిద్దుచున్
మిక్కిలి ప్రేమ పల్కురకు
మెప్పులరారగ జూపి వారిచే
అక్కయు నొక్క సత్కవయి
తంచును నిల్పితి పేరు యింకనా
తక్కినయట్టి పాత్రముల
తప్పుల దిద్దుదు శేరు సోదరా॥

అభినవ వ్యాసుడంచు కవు
లందరు మెచ్చగ కావ్యరాజముల్
సుభగతి వ్రాసి భూమిపతి
సూరివరేణ్యుడు నైన నైపుణీ
ప్రభునకు నంకితంబులిడి
పార్థివు మెప్పును ఖ్యాతిగాంచి యా
త్రిభువన పాలు మెప్పుగొన
త్రిదివము జేరగ బోదువా యికన్॥

అమర గురుండు స్వాగతము
హర్షమునన్ దగ నీకొసంగగా

రమణ సుధర్మఁజేరి సుర
రాట్కవి గుండెలు తల్లడిల్లగా
సమర రసప్రపూర్ణత
ననర్గళరీతి రచించి కావ్యముల్
అమర గురుండు మెచ్చ కృతు
లర్పణ జేయుచు నుండు వెంకటన్॥

కంతు జయంత చంద్రులకు
కందును జూపెడు నీదు రూపుసౌ
ర్కాంతలు గాంచి భ్రాంతలయి
కాంక్షలు మీరగ చెంత గుప్తమ్మరన్
భ్రాంతిని కావ్యకల్పనలు
భావమునం దలపోయుచుండునీ
స్వాంత మికెందు నుంజనదు
సాగునె మాయడకింక సోదరా॥

స్వర్గమునన్ జయంబు గని
సాగి వికుంఠమున న్వసించుచో
భర్గ పురంబు కేగెదం
భక్తుఁడ విశ్వరకున్ సమంబుగా
దుర్గమమైన బ్రహ్మపురి
తోవ గనుంగొని యేగి ప్రజ్ఞతో
నిర్గత సర్వకాంక్షివయి
నిల్తువో యచ్చటనే సుఖస్థితిన్॥

గీ॥ అక్షరుని కృప నీయాత్మ కమరు గాక
సచ్చిదానంద బ్రహ్మైక్య సత్పదంబు
సోదరా లక్ష్మినరసింహ సుస్థిరమయి
నీ యశో కాయ మవనిపై నిలుచుగాక॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



